Khidmat-e- Insan
Bandagi-e- Rab (Telugu)

# మానవసేవ దైవదాస్యం

మూలం

ఖుర్రం మురాద్

అనువాదం

షేక్ బద్రుజ్జమా

అనంత కరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# మానవసేవ దైవదాస్యం

ఈ ప్రపంచంలో జీవితం గడుపుతూ తోటి మనిషితో సంబంధం కలిగి వుండటం అనేది సహజంగానే ఎంతో ముఖ్యమైన విషయం. దీనికి స్ఫూర్తి ప్రేమ, సేవలే.

తోటి మనిషితో సంబంధం కలిగివుండే విషయం ధార్మిక జీవితంలో అన్నిటికంటే అత్యంత ముఖ్యాంశం. అయితే, నేడు ధర్మసంస్థాపనాన్ని తమ ధ్యేయంగా చేసుకొన్నవారి వద్ద కూడా దీని ప్రాముఖ్యం తగ్గిపోయింది. సాధారణంగా ఈనాడు మన ఆచరణలో కనపడే నమాజ్, రోజా, జకాత్, హజ్ వంటి కొన్ని సాంప్రదాయక ఆరాధనలు మాత్రమే అసలైన ధార్మిక జీవితానికి నిదర్శనాలైపోయాయి. సమగ్ర ధర్మసంస్థాపనా లక్ష్యంలో జిహాద్‌ను కూడా కలుపుకోవటం జరిగింది. అక్కడ కూడా మానవ సంబంధానికి గల ప్రాముఖ్యం లేకుండా పోయింది.

మనం సాధారణంగా ధర్మం (దీన్) సంపూర్ణ జీవిత విధానమని చెప్తూ ఉంటాము. దీనిపైనే ధర్మసంస్థాపన, అల్లాహ్ మార్గంలో సమరం (జిహాద్) యొక్క ఉద్యమం స్థిరపడింది. మనం గ్రహించవలసిన విషయం, మనిషి జీవితం మానవ సంబంధాల సమ్మేళనం. ఇద్దరు వ్యక్తులు కలిసి కుటుంబ జీవనం సాగించినప్పుడే మనిషి పుట్టుకకు బీజాంకురం. ఇద్దరు వ్యక్తులు కలిసి దాని అవసరాలు తీర్చి, పోషణ ఏర్పాట్లు చేసినప్పుడు అది జీవించగలుగుతుంది. ఆపై కూడా ఇతర వ్యక్తుల ప్రమేయంతోనే దాని జీవితం సాగుతుంది.

ధర్మసంస్థాపనలో సామాజిక వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ, రాజకీయ వ్యవస్థ వగైరా అనేక వ్యవస్థల ప్రస్తావన మనం చూస్తూ ఉంటాము. ఈ సర్వ వ్యవస్థలు మనిషికి ఇతరులతో సంబంధం, వారి పరస్పర సంబంధాలు వారి మధ్య ఆలోచ నలు, డబ్బు, సరుకులు, ఇతర వస్తువుల మార్పిడి తదితర సంబంధాలతోనే ఈ మొత్తం వ్యవస్థ ఉనికిలోకి వస్తుంది.

మనిషి తన మనస్సులో, తన వ్యక్తిగత జీవితంలో ప్రతిచోట, అల్లాహ్ అధికారాన్ని స్థాపించే ప్రయత్నం చెయ్యాలి. అదేవిధంగా మానవులతో సత్ససం బంధాలు జీవితంలోని సమస్త వ్యవహారాలలో అల్లాహ్ ఇష్టప్రకారం స్థాపించాలి. ధర్మసంస్థాపన యొక్క మొత్తం కృషి, నిజానికి మానవసేవ ప్రేమాభి మానాల ప్రతిరూపమే. మనిషి ఏవిధంగానూ అన్యాయానికి గురికాకూడదు. వారి జీవితాలు శాంతియుతంగా సాగుతూ కారుణ్యంతో నిండిపోవాలి. వారు భువిపై సుఖసంతోషాలతో జీవితం గడపగలగాలి. పరలోకంలో అల్లాహ్ శిక్షనుండి కాపాడుకోవాలి. ఈ విషయాన్ని ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు. "నాది, మీది ఉపమానం ఇలా ఉంది. ఎవరో నిప్పు రాజేశారు. మొత్తం ప్రాంతం ప్రకాశవంతం అయిపోయింది. అయితే దీపపు పురుగులు ఎలా అగ్నిలో పడతాయో అవి అగ్నిలో పడటం మొదలెట్టాయి. నేను అయితే వాటిని పట్టిపట్టి రక్షిస్తున్నాను అదేవిధంగా నేను మీ నడుములు పట్టిపట్టి చెబుతున్నాను, దైవదాసుల్లారా ఆ అగ్నినుండి రక్షించుకోండి! మరి మీరేమో నన్ను నిర్లక్ష్యం చేసి అగ్నిలో పడుతూ పోతున్నారు."

ఏ వ్యక్తి ధర్మసంస్థాపన కొరకు, సందేశప్రచారం కొరకు, సాక్ష్యం కొరకు కృషి చేస్తాడో అతని అసలు ఆవేదన, తపన, తృష్ణ, ఆలోచన ఇదే. అప్పుడే సందేశ ప్రచారంలో ఆ తపన, ఆ ప్రభావం, ఆ ఆకర్షణ జనిస్తుంది. అందువల్లనే మనిషి దీనివైపునకు వంగిపోతాడు. మానవ హృదయాలపై పొడి సందేశం ఎప్పుడూ ప్రభావం చూపదు. వారికొరకు ఆప్యాయమైన తపన కావాలి. బాగా భ్రష్టుపట్టి పోయిన జాతులలో సైతం, ప్రతి ప్రవక్త సందేశప్రచారం చేసే పద్ధతిలో, ప్రవక్తకు ఉండవలసిన తపన, ఆవేదన, బాధ వారికొరకు ప్రేమ గురించి తెలియ జేయబడింది.

మానవసేవ చేసేందుకుగాను ధర్మప్రచారకునిగా, ధర్మసంస్థాపన కృషీవలునిగా, మానవసేవ కొరకు అతడికి న్యాయం గురించి, అవగాహన కలిగించేందుకు పరలోకంలో అతణ్ణి నరకాగ్ని నుండి కాపాడేందుకు ఇటువంటి తపన అవసరమే. అదే నిజానికి సేవకొరకు ప్రేరణ, పునాది అవుతుంది. అది లేకపోతే దాన్ని సృజించాలి.

ఎవరైతే ప్రపంచంలో తమ గొప్పదనం, ప్రాబల్యం, అధికారాన్ని ఆశిస్తారో ధర్మసంస్థాపన వారి కొరకు కాదు. ఈ విషయాలకు అతీతంగా ఉండేవారే దైవ విశ్వాసులు. వీరు మానవులకు సేవకులై వారిపై అధికారం చెలాయిస్తారు. దివ్యఖుర్‌ఆన్ తెలియజేస్తుంది- "ఎవరైతే భువిలో తమ గొప్పదనం, ప్రాముఖ్యం, ప్రాచుర్యం, చెడును కోరుకోరో మేము వారికొరకు పరలోకం ప్రత్యేకం చేసి ఉంచాము" పూర్వకాలపు మన పరిపాలకులు ఈ విషయం ఋజువు చేశారు. హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్(ర)వారి ప్రఖ్యాత నానుడి. ఒక పరిపాలకుడు అయనకు ఇలా వ్రాసాడు. "మీరు జిజియా మినహాయిస్తే (మాఫీ చేస్తే) ప్రజా ధనాగారం ఖాళీ అయి పోతుంది." దానిపై ఆయన ఏమన్నారంటే, "అల్లాహ్ తన ప్రవక్తను పన్నులు వసూలు చేసే కలెక్టర్‌గా చేసి పంపలేదు, మార్గదర్శిగా చేసి పంపించాడు" ఒకవేళ ధనాగారం ఖాళీ అయిపోతే దానికి తాళం వేసేయండి మనం ప్రజల నుండి పన్నులు వసూలు చేసేందుకు పరిపాలన చేయడంలేదు. వారిని ఋజుమార్గంలో ఉంచడానికి పరిపాలన చేస్తున్నాము. అసలు ధర్మ సంస్థాపన లక్ష్యం, సిద్ధాంతం, నిరంతర సమరం, సందేశప్రచారం మనిషి పట్ల సానుభూతి, అతడి కొరకు ఆవేదన, అతనిపట్ల ప్రేమ, అతడి మార్గభ్రష్టత్వంపై ఆందోళన ఇంకా తన స్వయం కొరకు అల్లాహ్ అభీష్టం కొరకు అల్లాహ్ స్వర్గం పొందాలనే ఆతృత అసలు ప్రేరణ.

దివ్యఖుర్‌ఆన్‌లో తెలిపిన విధంగా అల్లాహ్ తన కారుణ్య లక్షణంపై, ఈ సంబంధాల వ్యవస్థను స్థిరపరిచాడు. అదే విషయంవైపు అనేక హదీసులలో సూచన చేయబడింది. దీనికితోడు మహాప్రవక్త ముహమ్మద్(స) సంప్రదాయం కూడా కరుణాకటాక్షాలను ద్యోతకం చేస్తుంది. దివ్యఖుర్‌ఆన్ కూడా దీన్ని

సూచిస్తుంది. దైవప్రవక్త మహనీయులు విశ్వాసుల కొరకు కరుణా కటాక్షాలకు ప్రతీక. ఆయన సర్వలోకాలకు కారుణ్యం.

ప్రవక్త మహనీయులు అల్లాహ్ యొక్క కారుణ్యం. అనేక హదీసులలో అనేక విధాలుగా మనుషులతో కారుణ్య సంబంధం విషయం విశదపరచ బడింది. ఉదాహరణకు 'అమన్ లా యర్హమ్' అంటే అర్థం ఎవడైతే కరుణ చూపడో, అతడిపై కరుణ చూపించబడదు. అంటే ఎవరైతే ప్రజలపై కరుణ చూపరో, వారితో కారుణ్య వాత్సల్యాల వ్యవహారం చేయరో, వారిపై అల్లాహ్ కూడా కరుణచూపడు. "ఎవరైతే మనుషులపై కరుణచూపుతారో, వారిపై కరుణా మయుడు కరుణ చూపుతాడు. మీరు భూవాసులపై కరుణ చూపండి ఆకాశవాసి మీపై కరుణ చూపుతాడు." ఈవిధంగా అసంఖ్యాకమైన హదీసులు ఉన్నాయి. మానవ సంబంధాలను అల్లాహ్ కరుణాకటాక్షాల మూసలో పోతపోసే విధంగా మలచాలని తెలియజేయబడింది. దివ్యఖుర్ఆన్ (సూరయె అల్‌ఫతహ్ వాక్యం 29)లో "రుహమావు బయ్‌నహుమ్" వారు పరస్పరం కరుణామయులుగా ఉంటారు. ముస్లింలు, ముస్లింల జమాఅత్, ముస్లింల సముదాయం ఒకరి కొకరు మానవాళి కొరకు కూడా సమగ్ర కారుణ్యం. హదీసులో ఇలా చెప్పబడింది. "అల్లాహ్ యొక్క ఈ సృష్టి అల్లాహ్ యొక్క కుటుంబం, ఆయన వంశం." ఎవడైతే తన కుటుంబీకులతో మంచిగా వ్యవహరిస్తాడో, మేలు చేస్తాడో, మంచి పనులు చేస్తాడో అటువంటి వ్యక్తి అల్లాహ్‌కు అత్యంత ఇష్టమైనవాడు. మనుషు లకు సత్కారం చెయ్యడం, వారితో మంచిగా వ్యవహరించడం అనేది అల్లాహ్ కారుణ్యం.

కారుణ్యం అనేది సంబంధాల మౌలిక మూస. ఒకవేళ మనం దాన్ని ఎక్కువగా విభజించదలిస్తే రెండు నియమాల ప్రకారం విభజించవచ్చు. ఒకటి ఏమిటంటే మానవులకు అత్యధికంగా లాభంచేకూర్చటం, వారి సేవ చేయటం, వారికి మేలు చేయటం, వారికి ఉపయోగపడటం, వారి అవసరాలు తీర్చటం, వారి బాధలను, ఆందోళనలను దూరం చేయటం, వారి బాధలను తేలిక చేయటం, ఇది పాసిటివ్ భాగం. రెండవది నెగటివ్ పార్ట్. అది ఏమిటంటే మనిషి ఇతర మనుషులకు బాధ,కష్టం కలిగించకూడదు. మనుషులకు సంబంధించి

ఏ పార్శ్వాలు వస్తాయో అవి పాజిటివ్, నెగిటివ్ ఈ రెండు పార్శ్వాలకు సమైక్యమవు తాయి.

ఎవరిదైనా హక్కు కాజేయటం అంటే అతడికి కష్టం కలిగించటమే. అందుచేతనే ఎవడిదైనా హక్కు కాజేయడం నుండి వారించబడింది. ఇంకా ముందుకుసాగి ఒకవేళ షరీఅత్ బోధనలను పరిశీలించినట్లయితే మీరు చూస్తారు. షరీఅత్ యొక్క చాలా చిన్నచిన్న బోధనలు కూడా ఈ సూత్రంపైనే ఆధారపడి ఉన్నాయి. ఒక మనిషి మరొక మనిషికి కష్టం కలిగించేందుకు కారణం కాకూడదు. ఉదాహరణకు ఇతరుల ఎవరి వస్తువైనా అనుమతి లేకుండా తీసుకోరాదు. ఎందుచేతనంటే దానివల్ల అతడికి కష్టం కలుగుతుంది. గనుక ఇది వారించబడింది. దేనివల్లనయితే మనిషికి కష్టం కలుగుతుందో అటువంటి పరిహాసం (వేళాకోళం) నుండి వారించబడింది. ముగ్గురు వ్యక్తులు గనక కలిసి వుంటే ఇద్దరు మనుషులు కలిసి రహస్యంగా మాట్లాడుకోరాదు. ఎందుచేతనంటే దానివల్ల మూడవ అతనికి కష్టం కలుగుతుంది. ఇంట్లో ప్రవేశించదలిస్తే సలాం చేసి అనుమతి పొందండి. ఇలా చేయకపోవటం వల్ల ఇంటిలోనివారికి కష్టం కలుగుతుంది. అతిథి ఇంటిలో భోజనం చేసి ఎక్కువసేపు కూర్చోరాదు, ఆతిథ్యమిచ్చేవారికి కష్టం కలగవచ్చు.

అన్ని సామాజిక, ఆచార వ్యవహారాలలోనూ, గౌరవ మర్యాదల బోధనల లోనూ ఈ నియమాలే పనిచేస్తున్నాయి. మీ ఏవిధమైన చేష్టవల్లనూ ఏదైనా మాటల వల్ల, ఏదైనా క్రియవల్ల ఏ ఇతర వ్యక్తికయినా కష్టం కలుగ కూడదు. ఏ హక్కులు విధించబడ్డాయో వాటిని నెరవేర్చాలి. మనిషి దౌర్జన్యమైన మార్గంపై నడవరాదు. ఎవరి హక్కును హరించరాదు. ఎవరి ప్రాణం, సొమ్ము, గౌరవ మర్యాదలను కాలరాయరాదు. దైవప్రవక్త(స) తన చివరి ప్రసంగంలో హజ్ సందర్భంగా నిలబడి స్పష్టంగా ఆదేశించారు. "ఈనాటి నుండి మీ ప్రాణాలు, సొమ్ము, మర్యాదలు ఒకరికి మరొకరిపై నిషిద్ధం (హరామ్)." ధర్మంలో, హదీసు లలో, దివ్యఖుర్ఆన్ బోధనలలో మర్యాదకరమైన పద్ధతులలో చిన్నచిన్న విషయాలలో సైతం ఈ సిద్ధాంతమే వర్తిస్తుంది. మనిషికి మనిషి కష్టం కల్గించే

ఎటువంటి పనిచేయరాదు. షరీఅత్‌లో అనుమతించబడిన పని తప్ప. ఎక్కడ ప్రాణం తీయటం ధర్మసమ్మతమో అక్కడ మాత్రమే ప్రాణం తీయటానికి అనుమతి ఉంది.

ప్రవక్త మహనీయుల ముందు ఏదైనా ఖిసాస్ తగవు వచ్చి ప్రవక్త మహనీయులు ఇరువర్గాలవారికి ఈ హితబోధ చేయకపోవటం అనేది ఎన్నడూ జరగలేదు. "చూడండి! ఖిసాస్ తీసుకోండి. (ఖిసాస్ అంటే ప్రాణానికి బదులు ప్రాణం తీయటం అనే ప్రతీకారం)." ఒక హదీసులో ఇలా తెలుపబడింది: ఈ విధమైన (వాజ్యం) కేసు ఏదీలేదు, ఏదైతే ప్రవక్త మహనీయుల వద్దకు వచ్చిందో, ఎందులోనైతే ప్రవక్త మహనీయులు ఇరువర్గాల వారికి ఈ హితబోధ చేయలేదో- "చూడండి! ప్రాణం తీయటం కోరుకునే బదులు ఆ వ్యవహారాన్ని రక్తపరిహారం చెల్లించుకునే పద్ధతిలో నిర్ణయించుకోండి-" ఎక్కడయితే ఆజ్ఞ ఇవ్వబడిందో, హక్కు నిరూపించబడిపోతుందో అక్కడకూడా ఈ హితబోధ చేయబడుతుంది. ఎక్కడయితే మిథ్యావ్యవస్థను చెరపవలసి వస్తుందో, సత్యవ్యవస్థను స్థాపించేందుకు సమాజాన్ని రక్షించేందుకు అనివార్యం అవుతుందో అక్కడ దీని అవసరం వస్తుంది.

ఇవి మానవ వ్యవహారాలు, సంబంధాల యొక్క మౌలిక నియమాలు. వీటిపై వివరణాత్మకమైన పరిశీలన అవసరం ఉంది.

మొట్టమొదటి పాజిటివ్ నియమం సేవది. దీని గురించి తెలుసుకోవాలి. ధర్మం యొక్క బోధనలు ఏవి, ధర్మం దృక్పథం ఏమిటి, ఎప్పుడయితే దాని రెండవ భాగం హక్కులను నెరవేర్చి దౌర్జన్యం చెయ్యకూడదు, కష్టం కల్గించకూడదు అన్నప్పుడు దీని ప్రాముఖ్యత ఏమిటి? దీనికి సంబంధించి ఖుర్ఆన్, హదీసుల్లో ఏ బోధనలు ఉన్నాయో వాటిని తెలుసుకోవలసిన అవసరం ఉంది.

సేవ, లబ్ధికి సంబంధించి ఖుర్ఆన్‌లో మనిషి సేవ, అతని అవసరం తీర్చే నిమిత్తం అల్లాహ్‌పై విశ్వాసానికి సమానంగా సత్కార్యాన్ని నిలబెట్టబడింది. చాలా తక్కువమందికి ఈ విషయంపట్ల అవగాహన ఉంది. ఖుర్ఆన్ అయితే దీనికి సంబంధించి ఈ విశ్వాసంతోపాటు దీన్ని ప్రస్తావించింది. సురయె అల్‌హాఖ్ఖహ్‌లో

ఒక వర్గంయొక్క ప్రస్తావన ఉంది- ఆ వర్గం నరకంలో పడవేయబడుతుంది- చెప్పబడుతుంది- దాన్ని పట్టుకోండి, బంధించండి, నరకంలో పడవేయండి. దాన్ని చార్జీషీటు ఖుర్ఆన్ ఇలా తెలుపుతుంది:

**ఇన్నహూ కాన లా యు మిను బిల్లాహిల్ అజీమ్. వలా యహుజ్జు అలా తఆమిల్ మిస్కీన్.** (69 అల్‌హాఖ్ఖహ్: 33-34)

"మహనీయుడూ, మహోన్నతుడూ అయిన అల్లాహ్‌ను ఇతను విశ్వసించే వాడు కాదు. నిరుపేదలకు అన్నంపెట్టండి అని ప్రోత్సహించేవాడూ కాదు."

ఈరెండు నేరాలు వారివి: ఒకటి ఏమిటంటే అతడు అల్లాహ్‌ను విశ్వసించే వాడు కాదు. రెండవది, పేదవాడికి అన్నంపెట్టేందుకు ప్రోత్సహించే వాడు కాదు. అంటే అన్నంపెట్టడం పెద్ద విషయమే కావచ్చు. కాని అన్నదానం కోసం ఇతరులను ప్రోత్సహించేందుకు సైతం అతను ముందుకు రాడు. అదేవిధంగా ప్రారంభ సూరాలలోని ముద్దస్సిర్ సూరాలో ఇలా ఉంది:

"మేము నమాజు చేసేవారిలోని వారం కాము, నిరుపేదలకు అన్నం పెట్టేవాళ్ళం కాము" (74: 43,44)

దివ్యఖుర్ఆన్ యొక్క అసంఖ్యాకమైన వాక్యాలు విశ్వాసం- సేవకు మధ్య ఒకదానికొకటి సంబంధం జోడిస్తూ వాటి సంబంధం ఎంత దృఢంగా స్థిరపరుస్తుందంటే కొందరు ముస్లిమేతరులు ఎవరయితే ఖుర్ఆన్ అధ్యయనం చేశారో ఇలా అంటారు: ఖుర్ఆన్ గ్రంథం సమాజ సంస్కరణ కొరకు విశ్వాసం ఆధారంగా సామాజిక సంబంధాన్ని చాలా చక్కగా వివరించింది.

పలుచోట్ల ఈ విషయం బోధించబడింది. దాసులకు సేవ చేసేందుకై అల్లాహ్‌ను విశ్వసించండి. మానవుల సేవచేసుందుకై పరలోకాన్ని విశ్వసించండి. దివ్యఖుర్ఆన్ రెండింటికి అవినాభావ సంబంధం కలిగించింది. వివిధ హదీసులలో వివిధ రకాలుగా ఈ విషయం చెప్పబడింది. మానవులతో మంచిగా వ్యవహరించటమే అసలైన సత్కార్యం. ఏ సత్కార్యాన్ని కూడా అల్పమైనదిగా భావించకండి. అది ఎంత చిన్న సత్కార్యం అయినాసరే. "నీ సోదరునితో చిరునవ్వుతో

కలవటాన్ని, సంతోషకరమైన ముఖంతో కలియటాన్ని కూడా అల్పమైనదిగా భావించకు."

ఒక హదీసులో సెలవియ్యబడింది. "నేను ఒక మనిషిని స్వర్గంలో ఆనందంతో తిరుగాడుతుండగా చూశాను. స్వర్గంలో ఎలా చేరావని అడిగాను తెలిసింది ఏమిటంటే దారిలో ఒక చెట్టు ఉండేది, దాని వల్ల ప్రజల రాకపోకలకు ఇబ్బంది కలుగుతుండేది. అతడు ఆ చెట్టును నరికివేశాడు. అల్లాహ్ దానికి బదులుగా అతడికి స్వర్గం ప్రసాదించాడు."

మన హదీసువేత్తలు ఒక పూర్తి అధ్యాయం దీనికి సంబంధించిన అంశాలతో చేశారు. మిష్కాత్‌లో 'దానధర్మాల పుణ్యం' రియాజుస్సాలిహీన్‌లో పుణ్య కార్యాల రకాల గురించి అత్యధికంగా ప్రస్తావన కనిపిస్తుంది. వీటన్నింటిలో ఈ విషయమే ఉంది-ప్రతి వ్యక్తి దానం చేయవలసి ఉంది. సదఖా ఇవ్వవలసి ఉంది. ఒక సహాబీ అడిగారు. 'నావద్ద ఏమీలేకపోతే?' ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు- రెండు చేతులతో సంపాదించండి, మీపై కూడా ఖర్చుచేయండి. ఇతరులపై కూడా. అతడు అన్నాడు 'ఇది నేను చేయలేను;' మరల ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు. ఒకవేళ ఏ వ్యక్తి అయినా, అగత్యపరుడయితే ఏదైనా బాధలో పడి ఉంటే అతడికి సహాయం చేయండి. అతడు ఏమన్నాడంటే, నేను ఇదీ చేయలేను. చివరిలో ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు. నీ చెడు నుండి ఇతరులను రక్షించు. కనీసం ఇంతైనా మంచి పని చేయండి. మానవుల సేవకై నిర్వహించే పాత్ర ఇది. ఇది అన్నిటికంటే స్పష్టంగా కనిపించేది.

ఇమాం బుఖారీ(ర.అ) 'వహీ అవతరణ' అధ్యాయంలో ఒక సంఘటన చెప్పారు. వహీ అవతరణ తరువాత ప్రవక్త ముహమ్మద్(స) హిరాగుహ నుండి వణుకుతూ తిరిగి వచ్చారు. తన శ్రీమతితో చెప్పారు. "జమ్మిలునీ, జమ్మిలునీ" "నాకు కప్పండి, నాకు కప్పండి" ఆమె కంబళి కప్పారు. కొంత సంతృప్తి కలిగింది. ఆయన(స) లేచి కూర్చుండి పోయారు. పూర్తి సంఘటన వినిపించి ఇలా అన్నారు: 'నాకు ప్రాణభయం ఉంది' ఆయన(స) ఈ విషయం తన హోదా యొక్క ప్రాముఖ్యాన్ని, దాని ఔన్నత్యాన్ని రాబోయే ప్రమాదాల దృష్ట్యా తన

అవగాహనను బట్టి సెలవిచ్చారు. దానిపై ఆయన భార్య ఏమి సెలవిస్తుంది: "అల్లాహ్‌పై ఒట్టు! అల్లాహ్ మిమ్మల్ని నష్టపరచడు. లేక ఇలా సెలవిచ్చారు. అల్లాహ్ మిమ్మల్ని వృధాచేయడు. ఎందుచేతనంటే, మీరు స్నేహసంబంధాలు పెంచుతారు. బీదల హక్కులు నెరవేరుస్తారు. ఎవరి బరువులు ఎత్తటానికి, ఎవరూ సిద్ధపడరో వారి బరువులను మీరు (స) ఎత్తుతారు. ఎవరి వద్దనైతే ఏమీలేదో వారికొరకు మీరు(స) సంపాదించి ఇస్తున్నారు. ఇంకా మీరు అతిథి సత్కార్యాలు చేస్తారు. సత్యమార్గంలో ఎదురయ్యే కష్టాలకు మీరు(స) ఇతరులకు సహాయం చేస్తారు. అల్లాహ్ మిమ్మల్ని ససేమిరా వృధా చేయడు." ఇది ప్రవక్త మహనీయుల దైవదౌత్యానికి ముందునాటి సంఘటన. ఇది ప్రవక్త మహనీ యుల సతీమణి మాటల ద్వారా తెలుస్తుంది.

మరొక సంఘటనలో హజ్రత్ జాఫర్ తయ్యార్(ర.అ) నజాషి దర్బారులో నిలబడ్డారు. నజాషి అడిగాడు; మీ ధర్మం ఏమిటి? చాలా సున్నితమైన సందర్భం. ఇది అంతర్జాతీయ స్థాయిలో ఇస్లాం పరిచయం కొరకు మొదటి అవకాశం. వారి ప్రాణం కూడా ప్రమాదంలో ఉంది. ఎందుచేతనంటే, ఖురైష్ తిరస్కారుల బృందం, నజాషి దర్బారులో హాజరయి ఉంది. వారి కోరిక, 'వీరు మావద్దనుండి పారిపోయినవారు, మీరు వీరిని తిరిగి మాకు ఇవ్వండి' అని. ఇటువంటి పరి స్థితిలో హజ్రత్ జాఫర్ తయ్యార్(ర.అ) అన్నారు. "ఓ చక్రవర్తి! మేము విగ్రహాలను ఆరాధించేవాళ్ళం, అబద్ధం ఆడేవాళ్ళం, చచ్చిన వాటిని తినేవాళ్ళం, వితంతువు లపై, అనాధలపై దౌరన్యం చేసేవాళ్ళం. మా మధ్యకు ఒక వ్యక్తి వచ్చాడు. ఆయన ఇలా అన్నాడు: 'రాళ్ళను ఆరాధించటం వదలివేయండి. సత్యం పలకండి, పొరుగువారికి సహాయం చెయ్యండి. వితంతువులను, అనాధలను ఆదుకోండి, సన్మార్గం అవలంబించండి" అని.

ఇది ధర్మపరిచయం బాగా ప్రారంభకాలంలో ఒక సహాబి చేయించింది. ఇది అసలు ధర్మం మాకు నేర్పింది. ఇది మా జీవితాలను మార్చివేసింది. విగ్రహారాధన విడిచిపెట్టిన తరువాత వెంటనే సత్యం పలకటం, వితంతువుల అనాధల సేవచేయుటం, పొరుగువారికి సేవ చేయటం, సచ్ఛరితులైన

మహిళలకు కళంకం ఆపాదించకుండా ఉండటం, చెడుప్రవర్తనకు దూరంగా ఉండటం- ఇవి అవలక్షణాలు అని ఆయన వివరించారు.

పరస్పర శ్రేయోభిలాష, ప్రేమ, బాహ్యపరమైన సానుభూతి కొరకు ముస్లింలకైతే హదీసులలో ఎక్కువగా శ్రద్ధవహించేందుకు ప్రోత్సహించబడింది. ఉదాహరణకు ఎవడైతే విశ్వాసి యొక్క ఏదైన బాధను దూరం చేస్తాడో అల్లాహ్ ప్రళయదినంనాడు, అతడి బాధలోనుండి ఏదైనా బాధను దూరం చేస్తాడు. ఎవడైతే విశ్వాసియొక్క ఏదైనా లోపాన్ని కప్పిపుచ్చుతాడో అల్లాహ్ ప్రళయదినం నాడు అతని లోపాలు, పాపాలను కప్పివేస్తాడు.

ముస్లిం, ముస్లింకు సోదరుడు. అతడు వారికి సహాయపడాలి. ఏ దాసుడు తన సోదరునికి సహాయం చేయడంలో నిమగ్నమయి ఉంటాడో అల్లాహ్ అతడికి సహాయం చేస్తూ ఉంటాడు. అల్లాహ్ మద్దతుపొందే పద్ధతి ఏమిటంటే, మనిషి తన సోదరునికి మద్దతునివ్వాలి. అతడి అవసరాన్ని తీర్చాలి.

ఒక హదీసు ప్రకారం ప్రవక్త మహనీయులు ముహమ్మద్(స) (నమాజ్ వస్త్రం) ముసల్లాపై నిలబడి ఉన్నారు. ఇఖామత్ (నమాజ్ కొరకు పిలుపు) చెప్పబడింది, ఒక మహిళ వచ్చి 'మీరు నడిచివచ్చి నా ఈ పని చెయ్యాలని' అన్నది. ప్రవక్త మహనీయులు జమాఅత్ వదలిపెట్టి ఆమె వెంట వెళ్ళిపోతారు. ఆమె పని చేస్తారు. తిరిగి వచ్చి జమాఅత్ నమాజ్ చేస్తారు. ఒకసారి సెలవిచ్చారు: "నేను నమాజ్ మొదలుపెడతాను. నా ఉద్దేశ్యం సుదీర్ఘ నమాజ్ చేయించాలని ఉంటుంది. కాని ఏదో పిల్లవాని ఏడుపు వినబడుతుంది. నేను ఆలోచిస్తాను అతని తల్లికి ఎంత కష్టం కలుగుతూ ఉంటుందోనని. గనుక నేను నమాజ్‌ను సంక్షిప్తం చేసేస్తాను. పిల్లవాడిని ఏడవటానికి నీవు ఇక్కడకు ఎందుకు తీసుకు వచ్చావని తల్లిని గద్దించటానికి కాదు. ఈవిధంగా పిల్లవాడి ఏడుపు వినబడగానే ప్రవక్త మహనీయులు నమాజ్ సంక్షిప్తం చేసేస్తారు. ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు. "నేను మస్‌జిదె నబవీలో రెండు నెలలు ఎతికాఫ్ చెయ్యటం కంటే ఒక ఘడియ కొరకు వెళ్ళి ఏ ముస్లింకైనా సేవ చేయటం, అతడికి మద్దతు ఇవ్వటం నాకు ఎక్కువ ఇష్టం" అని.

ప్రవక్త మహనీయుల ఈ ఔదార్యం అందరికొరకు ఉంది. అవిశ్వాసులు, బహుదైవారాధకులు, యూదులు, క్రైస్తవులు ఎవరు వచ్చినా వారితో ప్రవక్తశ్రీ ప్రవర్తన ఇదే రీతిగా ఉండేది. క్రైస్తవుల ప్రతినిధి బృందంవస్తే ప్రవక్తశ్రీ, వారిని మస్‌జీదె నబవీలో బసచేయించారు. వారికొరకు చక్కని వంటకాలు చేయించారు. వారు తమ ప్రార్థనలు చేయదలిస్తే మస్‌జీదె నబవీలో ప్రార్థన చేసుకునేందుకు అనుమతినిచ్చారు. వారు తమ ప్రార్థనను ఇక్కడ చేసుకోవచ్చు అని. ఇది ప్రవక్తశ్రీ వారి నైతికత, (సౌభ్రాతృత్వం) సోదరభావం, కారుణ్యం. ఈ సేవ యొక్క ప్రభావం వల్లనే ప్రజలు ఎక్కువగా ఇస్లాం స్వీకరించారు. నేను తరుచూ చెప్తూ ఉంటాను. ఎవరైతే ఖుర్‌ఆన్ విని ముస్లింలు అయ్యారో వారి సంఖ్య చాలా తక్కువ. వారిని మీరు వ్రేళ్ళపై లెక్కించవచ్చు. కాని, ఎవరైతే ప్రవక్త మహనీయుల కారుణ్యదర్పం, ఆయన వేధించిన వ్యక్తులతో మంచిగా వ్యవహరించిన తీరు చూసి ముస్లింలు అయ్యారో వారి సంఖ్య అపరిమితం. నేడు కూడా ఎవరయితే ముస్లింలు అవుతున్నారో ఆ ముస్లింలు అయ్యేవారిలో ఎక్కువ సంఖ్యవారిది, ఎవరయితే ప్రవక్త మహనీయుల ప్రవర్తన వల్ల, కారుణ్యం వల్ల మానవ స్నేహంవల్ల (ప్రవక్త శ్రీ) వారికి మానవులతోగల సంబంధంవల్ల ప్రభావితులై ముస్లింలు అవుతున్నారు. సంవత్సరాల, శతాబ్దాల తరబడి ఈ పరంపర కొనసాగుతూ వస్తుంది. ప్రారంభకాలంలో కూడా ఇదే ఉండింది. ప్రజలు వచ్చి ప్రవక్త మహనీయ(స) ముఖారవిందం చూసేవారు, వెళ్ళి చెప్పేవారు. ఈ మనిషి ఎంతో ఉదారస్వభావుడు. ఎంతో క్షమించేవాడు, ఎంతో మన్నించేవాడు- ఆయన్ని మేము తప్పక విశ్వసిస్తాం. ఖుర్‌ఆన్, హదీసులతో స్పష్టమవుతున్న మనిషితో ప్రేమ సంబంధాల పరిస్థితి ఇది. ఈ విషయానికి ఇంత ప్రాముఖ్యత ఎందుకొరకు ఉందంటే, అల్లాహ్ ఏ ఆరాధనలు విధిగా చేసాడో అవి తన కొరకు చేయలేదు, ఆయనకు ఏ ఆరాధన అవసరం లేదు. ఆయనకు (సజ్‌దా, రుకూ) సాష్టాంగపడడం, వంగటం, సంస్మరణ, స్తోత్రాలు ఏవీ అవసరం లేదు. హదీసులో వస్తుంది. ఆకాశంపై నాలుగు అంగుళాల స్థలం కూడా ఖాళీలేదు. ఎక్కడయితే ఏ దైవదూత అల్లాహ్ ఆరాధన చెయ్యకుండా ఉండటం లేదో దైవదూతలు అయితే, ముందుగానే చెప్పారు. మేమయితే తమ సంస్మరణ చేస్తున్నాము. తమ

పవిత్రతను కూడా కొనియాడుతున్నాము. మరి తమరు కొత్త సృష్టిని (మానవుని) ఎందుకు సృష్టిస్తున్నారు? అతడికి తమరు, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఇస్తారు. అక్కడకు వెళ్ళి, సొదరుడు, సోదరుని రక్తం చిందిస్తాడు. సోదరుడు, సోదరి జీవితం పాడుచేస్తాడు. ఇతడైతే భూమిపై కల్లోలం సృష్టిస్తాడు. మీకు గనక, ఇదే కావాలంటే మీ దాస్యం, మీ ఆరాధన జరగాలంటే ఈ పనైతే మేము చేస్తూనే ఉన్నాము కదా- కాని ఇది అల్లాహ్‌కు అవసరంలేదు. అల్లాహ్‌కు కావలసింది మనిషి, మనిషికి కారుణ్యదూత కావాలి. అందుచేతనే మానవసేవ అన్ని ఆరాధనల కంటే బరువైనది, గొప్పది.

మనిషి హక్కు కొల్లగొట్టడం, అతడికి బాధ కలిగించటం అనేవి అన్ని ఆరాధనలను వృధా చేసే విషయాలు. ఒక హదీసులో ఇలా ఉంది: ప్రళయం రోజున మనిషి కర్మపత్రంలో 3 భాగాలు ఉంటాయి. వేరువేరుగా మూడింటివి 30 భాగాలు అవుతాయి. ఒక ఫైలు ఉంటుంది. అందులో ఆ విషయాలు ఉంటాయి, వేటినయితే అల్లాహ సేసేమిరా క్షమించడో. మరొక ఫైలులో ఏమి ఉంటాయో వాటిని అల్లాహ ఖాతరు చేయడు. మూడవ ఫైలులో ఉండే విషయాలలో అల్లాహ లెక్క తీసుకోకుండా ఒక్క దాన్ని కూడా వదలడు.

మొదటి ఫైల్‌లో షిర్క్ (బహుదైవారాధన)కు సంబంధించిన కర్మలు ఉంటాయి. వీటిని అల్లాహ క్షమించడు. రెండవ ఫైల్‌లో మానవుని ఆత్మకు, దేవునికి సంబంధించిన కర్మలు ఉంటాయి. అంటే మనిషి నమాజ్ చేశాడా లేదా; ఉపవాసాలు పాటించాడా వదిలేశాడా వగైరా విషయాలు ఉంటాయి. వీటిని గురించి అల్లాహ పట్టించుకోడు. ఆయన కోరినట్లయితే క్షమిస్తాడు లేదా లెక్క తీసుకుంటాడు.

పోతే మూడవ ఫైల్‌లో మనిషి మనిషికి మధ్య ఉండే పరస్పర హక్కులు, ఒకరిపైనొకరు చేసుకున్న దౌర్జన్యాలు, అక్రమాలు, పరస్పర వ్యవహారాలు, సంబంధాలను గురించిన కర్మలు ఉంటాయి. ఈ ఫైల్‌లోని ఒక్క విషయం గురించి కూడా అల్లాహ బాధ్యత తీసుకోడు. అన్యాయానికి గురైన మనిషికి అతని హక్కు ఇప్పిస్తాడు. ఒకవేళ ప్రతివాది మరేదైనా కారణం చేత దేవునికి ఎక్కువ

ప్రీతిపాత్రుడయిఉంటే దేవుడు అతని చేత ముద్దాయికి కొంత ఎక్కువయిచ్చి రాజీ చేయిస్తాడు. అంతేగాని, పీడితుడు స్వయంగా క్షమించనంతవరకు అల్లాహ్ తనంతటతాను క్షమించడు.

ఈ మాట ఎంతో చక్కగా ఒక హదీసులో ఈవిధంగా చెప్పబడింది. "ప్రవక్త మహనీయులు ఇలా అడిగారు, 'నా అనుచర సంఘంలో పేదవాడు ఎవరో మీకు తెలుసా?' సహాబాలు ఆలోచించి చెప్పారు- 'ఎవడి వద్దనయితే డబ్బు దస్కంలేదో, సొమ్ము సంపదలేదో అతనే పేదవాడు.' ప్రవక్త మహనీయులు చెప్పారు: నా అనుచర సంఘంలోని బీదవాడు అతడు కాడు. నా అనుచర సంఘంలో పేదవాడు ప్రళయ దినంనాడు వస్తాడు, అతను చాలా ఎక్కువ నమాజులు, చాలా ఎక్కువ ఉపవాసాలు, చాలా ఎక్కువ దానాలు చేసి తన కర్మపత్రంలో జమ చేసి తీసుకువస్తాడు. అయితే వాటితో పాటు అతడు ఎవరి నైనా తిట్టి ఉండవచ్చు, ఎవరికైనా బాధ కలగజేసి ఉండవచ్చు. ఎవరి సొమ్ము యినా తిని ఉండవచ్చు. ఎవరి రక్తం అయినా చిందించి ఉండవచ్చు. ఎవడినైనా కొట్టిఉండవచ్చు. ఆ తరువాత అల్లాహ్ సమక్షంలో అతని వల్ల అన్యాయానికి, దౌర్జన్యానికి గురయిన ముద్దాయిలందరూ నిలబడతారు. అప్పుడు అల్లాహ్ అతని సత్కర్మలను వారందరికీ పంచిస్తాడు. ఇలా పంచిఇచ్చిన తరువాత అతని సత్కర్మలన్నీ అయిపోతే పీడితుల కర్మపత్రాలలోని దుష్కర్మలను అతని కర్మ పత్రంలో వేయడం జరుగుతుంది. చివరికి ఆ మనిషి ఉత్త చేతులతో ఉండి పోతాడు. అప్పుడు అతన్ని అగ్నిలో పడవేయడం జరుగుతుంది."

కర్మపత్రంలో నమాజులు, ఉపవాసాలు, దానధర్మాలు ఎన్ని ఉన్నప్పటికీ ఇలా జరుగుతుంది. ప్రళయం రోజు సిరులు, గిరులు ఏవీ పనికిరావు. ఆరోజు దైవశిక్ష నుండి తప్పించుకోవడానికి కావలసింది సిరిసంపదల కరెన్సీ కాదు. సత్కార్యాల కరెన్సీ మాత్రమే పరలోకంలో చలామణి అవుతుంది. ఈ ప్రపంచంలో హత్యానేరానికి శిక్ష పడకుండా నష్టపరిహారంగా డబ్బిచ్చి తప్పించుకోవచ్చు. కాని పరలోకంలో పుణ్యకార్యాలు మాత్రమే మనిషిని నరక శిక్షల నుండి రక్షిస్తాయి.

మానవ హక్కులకు, ముఖ్యంగా మానవ ప్రాణానికి ఎంత ప్రాముఖ్యం ఉందంటే ఖుర్‌ఆన్‌లో ఇలా చెప్పబడింది: "ఎవడైతే ఒక ప్రాణాన్ని అన్యాయంగా తీస్తాడో అతడు సర్వమానవాళిని హత్యచేసినట్లే, ఎవడైతే ఒక ప్రాణాన్ని కాపాడుతాడో అతడు మొత్తం మానవాళిని కాపాడినట్లే." ఎవడివల్ల హత్య గావించబడిందో అతడు కనీసం ఒక బానిసకు విముక్తి కలిగించాలి. ఇంకా దాని రక్త పరిహారం చెల్లించాలి. ఎవడైతే ఉద్దేశపూర్వకంగా హత్యచేస్తాడో అతడి కొరకు ఖుర్‌ఆన్ రక్తపరిహారం గురించిగాని, నష్టపరిహారం గురించిగాని ప్రస్తావించ లేదు. అతణ్ణి మేము శాశ్వతంగా నరకంలో పడవేస్తామని చెబుతుంది. ఖుర్‌ఆన్‌లో ఉద్దేశపూర్వకమైన హత్య గురించిన ప్రస్తావన ఏదీ లేదు. దాని శిక్ష అయితే మరి ఇదే, హతుని వారసులు క్షమించటం లేదా ఆ హంతకుడు శాశ్వతంగా నరకానికి పోవటం మాత్రమే.

అల్లాహ్ రక్తపరిహారానికి చట్టం, ఎంత వివేకవంతంగా చెప్పాడంటే ముందు సొమ్ము ప్రాముఖ్యతను, తరువాత ప్రాణం యొక్క ప్రాముఖ్యతను నిర్ణయించాడు. దాని తరువాత శరీరంలోని అన్ని అవయవాల ప్రాధాన్యతను నిర్ణయించాడు. కంటికి బదులు కన్ను, ప్రాణానికి బదులు ప్రాణం, చెవుకు బదులు చెవు. ఆ విధంగా పూర్తిగా రక్తపరిహార చట్టం నిర్ణయించాడు. ఇంకా ఉమ్మత్ కొరకు, రక్తపరిహార చట్టంలోనే అసలు జీవితం ఉందని తెలియజేశాడు. దాని తరువాత ధనం యొక్క ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఒక మనిషి సొమ్ము రెండవ వ్యక్తిపై హరాం, నిషిద్ధం. ఒక జానెడు భూమి అయినాసరే ఎవడైనా అన్యాయంగా ఆక్రమించుకుంటే ప్రళయం నాడు ఏడు భూముల కంఠహారం అతడి మెడలో వేయబడుతుంది. ఎవడైనా భద్రపరచమని అప్పగించబడిన యుద్ధసొమ్ములో నుండి ఒక చిల్లిగవ్వైనా దొంగిలిస్తే మీరు అతణ్ణి (షహీద్) అమరవీరుడు అంటున్నారు గాని అతడు నరకానికి పోతాడు. ఎందుచేతనంటే అతడు భద్రపరచబడిన డబ్బు దొంగిలించాడు గనక.

ఎవడి సొమ్ము అయినా, జమాఅత్ సొమ్ము అయినా దాన్ని అధర్మంగా కాజెయ్యటం నిషిద్ధాన్ని తినడం లాంటిది. దీని విషయమై ఎంతో కఠినమైన శిక్ష ఉంది. దాని తరువాత గౌరవమర్యాదలను నిషేధించడం జరిగింది. ముస్లిం,

ముస్లింను ఎగతాళి చేయరాదు. అపహాస్యం చెయ్యరాదు. అతణ్ణి దుర్భాషలాడరాదు. అతడిపై పరోక్షనింద మోపరాదు. అతణ్ణి అగౌరవపరచరాదు. అతణ్ణి ద్వేషించరాదు. తిట్టరాదు. ఈ ఆజ్ఞలు అన్నీ ఖుర్ఆన్‌లోనూ, హదీసులోనూ వివరంగా తెలుపబడ్డాయి.

మీరు గనుక ఈ విషయాలను పరిశీలించినట్లయితే, రెండు విషయాలు ముందుకు వస్తాయి. ఒకటి మానవసేవ, దానితో పాటు ప్రేమ, అతడి కొరకు విచారణ, ఆవేదన చెందటం. నేను ముందుచెప్పినట్లుగా (జిహాద్) సమరం మరియు ధర్మప్రచారం ధర్మసంస్థాపనానికి పునాది. ఎప్పుడయితే జీవితంలో ఈ పునాది పడుతుందో, అప్పుడే మానవులతో ఆ సంబంధం ఏర్పడుతుంది. మనుషులు ఈ సందేశాన్ని అంగీకరిస్తారు. ఈ సందేశం ఎప్పటివరకూ పుస్తకాలలో వ్రాయబడి ఉంటుందో, సాక్ష్యాధారాలతో తెలుపబడుతూ ఉంటుందో, సామాన్య ప్రజల కొరకు అందులో ఎటువంటి ఆకర్షణ ఉండదు. ప్రవక్తల సందేశం కూడా ప్రజలు తమ కళ్ళముందు ప్రవక్తల నైతిక ప్రవర్తన చూసిన తరువాతనే అంగీకరించారు. మానవ సేవ, వారికి సహకారం, వారి అవసరాలు తీర్చటం, వారి సుఖసంతోషాలలో పాలుపంచుకోవటం, వారితో సాధ్యమైనంత వరకు సహకరించటం. ఇది మహత్తరమైన పుణ్యాలకు సంబంధించిన విషయాలు. నమాజ్, రోజా, జకాత్ ఇతర అన్ని విషయాలకంటే గొప్ప పుణ్య కార్యాలుగా పరిగణించబడ్డాయి.

రెండవవైపు పాపాలన్నింటిలో గొప్ప పాపం, మానవ హక్కులు కాజేయటం, మనుషులకు కష్టం కల్గించటం. ప్రవక్త మహనీయులు చెప్పారు: "ఎవడైతే ముస్లింలకు కష్టం కలిగించాడో, అతడు నాకు కష్టం కలిగించాడు. ఎవడైతే నాకు కష్టం కలిగించాడో, అతడు అల్లాహ్‌కు కష్టం కలిగించాడు. ఎవడైతే ముస్లింలను సంతోషపరచాడో అతడు నన్ను సంతోషరిచాడు. ఎవడైతే నన్ను సంతోషపరిచాడో, అతడు అల్లాహ్‌ను సంతోషపరిచాడు- అంటే మహాప్రవక్త మహనీయులు ముస్లింల హృదయాల, గౌరవాల, బాధల, ఆవేదనల సంబంధాలను నేరుగా తనతో జోడించి, అల్లాహ్‌తో జోడించారు. సర్వబోధనలు సమీ

కరించి ఈ రెండు నియమాలపరంగా ఏకం చేయబడ్డాయి. ఒకటి పాజిటివ్, రెండు నెగిటివ్.

ఒకవేళ మనిషిలో పాజిటివ్ లేకపోతే హదీసులో చెప్పబడినట్లు, కనీసం తన చెడునుండి ప్రజలకు కష్టం కలిగించరాదు- కనీసం మీరు చేయగలపని, ఒకవేళ సంపాదించలేకపోతే, ఇవ్వటానికి డబ్బులేకపోతే నడవగల శక్తి లేకపోతే అగత్యపరుని సహాయం చెయ్యలేకపోతే కనీసం మీ నోటితో ఇతరులకు కష్టం కలగచేయటంగాని, చేత్తో కష్టం కలిగించేపనిగాని చెయ్య రాదు. ఇది సత్కార్యం, దానం కంటే తక్కువ స్థాయి పని, ఇది తన స్వాధీనంలో ఉన్న పని. ఏదీ చెయ్య లేకపోతే కనీసం ఈ పుణ్యమైనా చేయగలడు.

ఒకవైపు మద్దతునివ్వటం, రెండవవైపు కష్టం కలిగించకుండా ఉండటం, నిజానికి ఇవే కారుణ్యానికి రెండు శాఖలు. దీని ఆధారంగానే దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సంబంధం దాసులతో స్థిరపరిచాడు. ఆయన గొప్పగా కరుణించేవాడు, ఆయన కనికరించేవాడు కూడా. అయన దాసులు కూడా వారిలో వారు, ఆయన కారుణ్యానికి ప్రతీకలు కావాలని అల్లాహ్ కోరుతున్నాడు. విశ్వాసులు ఒకరికొకరు కారుణ్యం కావాలి. విశ్వాసి దైవప్రవక్త ముహమ్మద్(స) అనుకరణలో ఇతర మానవుల కొరకు కారుణ్యం కావాలి. అల్లాహ్ ప్రవక్త(స) సర్వలోకానికి కారుణ్యం, విశ్వాసులు కూడా సర్వ మానవులను కనికరించేవారు కావాలి.

అల్లాహ్‌తో సంబంధం తరువాత సందేశ ప్రచారం కోసం, ధర్మసంస్థాపన కోసం, జిహాద్ కోసం, అన్నింటికంటే ముఖ్యమైన విషయం ఇదే. అన్ని పనులలో దీని ప్రాముఖ్యత ఇదే. దీనిని పరిరక్షించటం చాలా అవసరం. అల్లాహ్ కోరినట్లయితే, ఆయన పేరు చెప్పుకునేవారు, పరిపాలకులు అయితే వారు ప్రజలకు దైవాలుగా, దౌర్జన్యపరులుగా, వేధించేవారై ఉండకూడదు. వారిని ప్రేమించేవారై వారికి సేవ చేసేవారై ఉండాలి. సహాబాలు ఈ స్థాయికి చేరి, ప్రపంచ నాయకత్వం, పరిపాలన చేపట్టారు. వీరు ఎక్కడికి వెళ్ళితే అక్కడ వారిని ఎదుర్కొనకుండానే ప్రజలు పట్టణ ద్వారాలు తెరిచివేసారు. ప్రజల హృదయాలు జయించబడేవి. మీకు తెలుసు. తారీఖ్ బిన్ జియాద్ కొన్ని వందలమందిని

తీసుకొని స్పెయిన్ వెళ్ళాడు. స్పెయిన్ పూర్తిగా జయించేశాడు. ముహమ్మద్ బిన్ ఖాసిం కొన్ని వందల మనుషులను తీసుకొని భారత దేశం వచ్చాడు. పూర్తి సింధ్ జయించాడు. ఇది యుద్ధం ద్వారా కాదు. ఇక్కడి ప్రజలు ముందునుండే ఇస్లాం కొరకు సంసిద్ధులై ఉన్నారు. వారి హృదయాలు ఇస్లాం కొరకు తెరుచుకోబడ్డాయి. అరబ్బు వ్యాపారస్తులతో భారతదేశస్తుల సంబంధాలు పరిశుభ్రమైనవి, స్పష్టమైనవి. స్పెయిన్ కూడా ఎంతో దూరంగా లేదు. ముస్లింలు లిబియా, మురాకష్ వరకూ చేరిపోయారు. వీరు ఎటువంటివారో ప్రజల హృదయాలకు తెలుసు. సుప్రసిద్ధ సంఘటన- ఒకచోట, ముస్లింల యుద్ధం కారణంగా తమ పట్టణం ఖాళీ చేయవలసి వచ్చింది. అప్పుడు వారు ప్రజల నుండి వసూలు చేసిన జిజియా (పన్ను) వారికి తిరిగి ఇచ్చేసారు. క్రైస్తవులు ఏడవడం మొదలెట్టారు, ఇటువంటి వారు మన మధ్య ఉండాలి. మమ్మల్ని పరిపాలించాలి అని.

ప్రజలు విశాల హృదయంతో ఇస్లాంని ఆహ్వానించారు. ముస్లింలు ఎక్కడికి వెళ్ళారో అక్కడే స్థిరపడిపోయారు. అక్కడ వివాహమాడారు. వారు ప్రజల సేవకులు గనుక వారి పరిపాలకులు కూడా ప్రజలకు సేవచేసేవారు. ముతక దుస్తులు ధరించేవారు. గంజి త్రాగేవారు కాని ప్రజాసేవ చేసేవారు. ఈ పనికై ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు. ఇస్లాం యొక్క ఆ బోధన ఫలితంగానే ఈ ప్రవర్తన ఉబికి వచ్చింది.

ఈ ప్రవర్తనే వారిని ప్రజలు ప్రేమించేవారిగా చేసివేసింది. ఇంకా కరుణామయునికి కూడా ప్రేమించేవానిగా చేసివేసింది. ఎప్పుడయితే మనిషి కరుణామయుడ్ని ప్రేమించేవాడయిపోతాడో అతడి దారిలో ఏదీ అడ్డంకి కాలేదు. సాఫల్యమార్గంపై మనిషి నడిచేందుకై మనిషి తన ఆరాధన, నైతికతపై శ్రద్ధ వహించాలి. దైవమార్గంలో తన ధనప్రాణాలు వెచ్చించగలగడం ఎంత అవసరమో అక్కడే మనిషి ప్రవర్తనలో ఈ రెండు గుణాలు (లక్షణాలు) కూడా అవసరం, అతడు ఇతరుల సేవచేయాలి. వారికి కష్టం కల్గించకూడదు. ప్రజలు వీరు కారుణ్యదైవదూతలు అని భావించాలి. మన మధ్య తిరుగాడుతున్నారు. వారి ప్రాబల్యం వలన మా జీవితాలు కారుణ్యం, అభివృద్ధులతో నిండిపోతాయి.

నేను ప్రారంభంలో హదీసు చెప్పాను. మీరు భూవాసులపై దయచూపితే ఆకాశవాసి మీపై దయచూపుతాడని. మీరుగనక భూవాసులపై దయచూపక పోతే, ఆకాశవాసి కూడా మీపై దయచూపడు. ఈ విషయం ఎల్లప్పుడూ దృష్టిలో ఉండాలి. మాటలతో చేతలతో, ఇతరులకు కష్టం కలిగించకూడదు.

మనం అందరం ఈ విషయమై కృషి చేయాలి- మన జీవిత సమీక్ష చేసుకొని (మన ప్రవర్తనను) ఈ కోణం నుండి సంస్కరించుకోవాలి. స్వీయసంస్కరణ చేసుకోవాలి. స్వీయసంస్కరణయే సమాజ సంస్కరణకు పునాది కాగలదు.

